## ఒకలక్ష మహాదానము

బీదరుజిల్లా హుబలగుండి నివాసులైన శ్రీ ఫత్తేపూర్ శరణప్పదొరగారు మొన్నటి దసరా మహోత్సవ సందర్భమున కర్ణాటక దేశపు వీరశైవుల విద్యాభివృద్ధినిగూర్చి ఒకలక్ష రూపాయీల మహాదానమును గావించినారు. ఇది చాల గొప్ప విషయము. ఇదివరకు మహారాష్ట్ర వీరశైవులకును ధర్మగ్రంథ ప్రచారము కొరకై శ్రీవారుగారు పెక్కువేలు ఇచ్చియున్నారు. నిజాంరాష్ట్రములో ఇట్టిమహాదాతయుండుట గమనింపదగిన విషయము. అన్నివిధముల వెనుకబడి కష్టములను అనుభవించుచున్న ఆంధ్రవీరశైవుల విద్యాభివృద్ధినిగూర్చియును శ్రీ శరణప్పగారు బాగుగా శ్రద్ధవహించవలయును. వీరి పూర్వపురుషులు ఆంధ్రదేశీయులని [ఫత్తేపూరు, తాలూకా హుజూరునగరు, జిల్లా నల్లగొండ] వినుచున్నాము. ముందు శివరాత్రి లోపుగా యీ ఆంధ్రవీరశైవుల భాగ్యమును శ్రీవారు నిర్ణయింతురని యాశించుచున్నాము.

ఒక యాంధ్రుడు

## కృష్ణమ్మవేదవిద్యాలయము

(గంగవరం)

దాన కలిత వృద్ధులగు శ్రీ వరేటి కృష్ణమ్మగారు (కమ్మవారు) ౩౦౦౦౦రూ॥ విలువగల ౨౫ ఎకరముల భూమిని, ౬౦౦౦ విలువ జేయుపెంకుల మిద్దె భవనమును (డాబా) సార్వదేశిక ఆర్యప్రతినిధి సభవారి యాజమాన్యమున విద్యాలయమును గురుకుల పద్ధతులమీద నడపుటకుగాను ట్రస్టీలను ఏర్పరచి రిజిస్టరుచేసి విద్యాలయమును నడిపించుచున్నారు. ౨౦మంది విద్యార్థులున్నారు. ఒక భోజనాలయము కూడా సాగించబడుచున్నది. ఈగ్రామము బెజవాడనుంచి మద్రాసుకుపోవు రైనులో చీరాల వేటపాలెం, కడవకుదురు స్టేషనులకు ౧౬,౧౧౨ మైళ్ళదూరములోనున్నది. బెజవాడనుంచి కడవకుదురుకు రూ౧,౭౬ చార్జి. ఇందలి ప్రధానాధ్యాపకులు గాంధీపూర్వసార్వదేశిక ఆర్య ప్రతినిధిసభా ప్రచారకులును, భారతస్వాతంత్ర్య ప్రథమయుద్ధము, చేతావనిఖండన, ఆర్యాభివినయము మొ॥ గ్రంథరచయితలును, ప్రసిద్ధవిద్వాంసులునగు శ్రీ ఆన్నె కేశవార్యశాస్త్రిగారు పనిచేయుచున్నారు. హిందీ, తెనుగు, సంస్కృత భాషలు నేర్పబడుచున్నవి. తమస్థానమును ఆర్యశిక్షాదీక్షలయందభివృద్ధి చేయించదలచిన దంపతులీ సుసమయమును చేయిజారిపోనీయకుందురు గాక! భగవంతుడీదాతృత్వమునకు దీర్ఘాయువొసగుగాక! విశేషములు తెలుసుకొనగోరువారు, రిప్లయికార్డు వ్రాయవలయును.

చిరునామా—

శ్రీవరేటి కృష్ణమ్మగారు పి. ఓ. గంగవరము వేటపాలెము గుంటూరుజిల్లా.

## ఆంధ్ర జిల్లాసంఘ సమావేశము

(స్వ. వి.) మహబూబునగరము ౧౭—౧౧—౪౮

ఈజిల్లా కమిటీఅధ్యక్షులగు శ్రీ మందుముల రామచంద్రరావుగారు, మరికొందరుసభ్యులు నేటి రాత్రి లోకలుదిచ్చేసిరి. భోజనానంతరము స్థానిక జిల్లా కార్యాలయములో నే రాత్రి ౧౦,౧౧ లకు ఈసమావేశము ప్రారంభింపబడి రాత్రి ౧౨. ౩౦వరకు జరిగెను. దీనిలో కొల్లాపురం, అలంపూరు, మక్తల్ స్థానిక కమిటీసభ్యులు పాల్గొనియుండిరి. కోరముపూర్తి యయ్యెను. కమిటీసభ్యులు కానివారుకూడ పలువురుపాల్గొనియుండిరి. ఈ క్రిందిసమస్యలపైచర్చచేయబడి తీర్మానింపబడెను.

౧ స్థాయిసంఘ కార్యకారిణీసభవారు తీర్మానించి ఆమోదనకై సూచనగా పంపిన తీర్మానములను ముందిడుకొని పూర్వపుజిల్లా ఉపనియమములనుసవరణచేయబడెను. అనుమతినొసంగుటకై స్థాయిసంఘమునకు పంపబడెను.

౨ ఆహారసమస్యపరిష్కారవిషయమై స్థాయి సంఘముయొక్క తీర్మానాన్ని బలపరుస్తు ఈ సారి మహబూబునగరం జిల్లాలో పునాసచేలు పూర్తిగా నష్టపోయినవి. కాబట్టి ఈ సంవత్సరము వఱకు సర్కారు వసూలు చేయదలంచినధాన్యమును తీసుకొనగూడదనియు, బీదలకు ధాన్యము పప్పుయి చేయుపద్ధతులలో ప్రజాహితకార్యకర్తలు కూడ గ్రామకమిటీసభ్యులుగా జేర్చి వారిసంప్రదింపుపై ఈసమస్య పరిష్కారము చేయవలయునని తీర్మానింపబడెను. ఈసంబంధములో ప్రచారము చేయుటకు వాక్స్వాతంత్ర్యము కార్యకర్తల కివ్వవలయునని ప్రభుత్వమువారితో కోరిరి.

౩ ఈజిల్లావార్షికోత్సవము ఈ సంవత్సరము నకై అలంపూరులో ఏర్పాటు చేయబడినది. కార్యదర్శి మరికొందరిసభ్యుల సంప్రదింపుచే స్వామాఘ బహుళ, ౧౫; ఫిబ్రవరి ౧౧,౧౨, తారీకుకేర్పాటు చేయబడినవి.

జిల్లాకమిటీకివచ్చిన మక్తల్ తాలూకాసభ్యులు రాత్రి కొంతవరకు వేచియుండి నిద్రచే కునుకుచుండిరి. కార్యదర్శిగారు టీ, సప్లయి జేసినను ఏ కొవారిని నిద్రవిడువలేదు.

## కోటకదిర

(స్వ. వి.) ౧౫—౧౧—౪౮

కోటకదిర, ఒబ్బాయిపల్లి మొదలుగాగలదేవరకదిర పట్టివారు. ప్రస్తుతము ప్రభుత్వము ౧౦ఎకరాల కంట్రోలు ఏర్పాటుచేసి రైతులతో యకరా ౧కి ౩ ౨౦ జొన్నలు యివ్వవలసినదని యిబ్బంది పెట్టుచున్నారు. ఇక్కడ జొన్నచేలు సరియైనకాలములో వర్షాలులేనందున కంకులు పాలుపట్టలేదు. కొన్నిచేలు పాలుపోసినతర్వాత మితిమీరివర్షాలు పడుటచే నీరుపట్టి నల్లబారిపోయినవి. పురుగుపట్టి కంకులన్ని, రాలుపోయినవి, జీతగాండ్లకుకూడ అంబలి కాసిపోయుటకు ధాన్యములేకుండాపోయినవి.

## కిరోసిన్ చక్కెర కరవు

కోస్గి కథ

స. సాలార్జంగుజాగీరులోని కోస్గిలో ఇంచుమించు ౧౨౦౦౦ జనసంఖ్యకలదు. ఇంతపెద్ద స్థలానికి ౫సంచులచక్కెర ౨౦౦ గ్యాలనుల గ్యాసునూనె పంపుచున్నారు. నూనెకై అమ్మేదుకాణమువద్ద నూర్లమంది కోడి సంతములో కాళ్లుతొక్కుకున్నట్లుగా ఒకరిమీద ఒకరు విరుగబడి ముష్టియుద్ధం పునఃపునః అని ప్రతిదినం ఆసనపడుచున్నాము.ఇంతియుద్ధంచ్చేసినా తుదకు కాళీకిపోయి కొంగకట్టతెచ్చినట్లుగా రబ్బీసల గ్యాసునూనెను ఒకమనిషి తెచ్చుకొంటాడు, అదికూడా ముందుగాజొరబడిన పైల్వానులకేదొరకును. వెనుకనున్న బలహీనులకు అయిపోయింది పోండి, డబ్బాబోర్లించిచూపితే అయ్యో! గ్రహచారమాఅంటూ ౩గంటలు వేచియుండినవారు నక్షత్రాలనులెక్కించుచూ ఆమేకవారిని సప్తపురుషాంతరాలను దిగదీయుచుచు వెళ్లిపోతారు, ఇంతేకాదు యీ గుంపులోనుండి నూనెతో బయటికివచ్చుట తాడుమీద దొమ్మరి నడకవంటిది, ఇంచుమించు౧౦.౧౨సీసాలు భూమిపాలగును,

పాతతాసీల్దారుపోయి కొత్తవాడు వచ్చినాడు, కొత్తదనంచూపించుటకు ఇకముందు చిట్టీలిస్తామని చాటించినాడు, అట్టిచిట్టీలవారికి నెలకు ఒకసీసా సాధారణం వారికి అధికార్లకు పెద్దసాహుకార్లకు నాల్గుసీసాలు యిస్తున్నారు, రాత్రి దీపాలుపెట్టితే దీపావళిపండుగైనట్లు అయిపోయింది, ఇకచక్కెర కథవినండి, అయిదుసంచుల చక్కెర తలా చేరడు కూడా యీజనానికి నెలకుదొరకుటలేదు, బీదలకు దొరకనేదొరకదు,

## ఎస్. భూపతి రెడ్డిగారి అస్వస్థత

(ఓ.వి) సిరిసిల్ల ౭ డై ౧౯౪౮ ఫ.

నిజాంరాష్ట్రాంధ్ర మహాసభ స్థాయిసంఘ సభ్యులగు శ్రీ-ఎస్ భూపతిరెడ్డిగారు నిర్బంధములోవుంచబడి ఆరునెలలు కావచ్చెను. నానాటికి శరీరముకృశించి చిక్కిపోయినారు. పక్షము రోజులనుంచి వివిధరోగములకుగురియై శయ్యపైనుండి లేవలేనిస్థితిలోనున్నారు.

౩౦ ఆజూరుసాయంత్రముసిరిసిల్లనుంచి సర్కారి డాక్టరగు శ్రీ.వి.ఎన్. మాధవరావుగారు శ్రీరెడ్డిగారిని దర్శించిరి. చాల చిక్కిపోయినట్లు గమనించిరి. తూకముచూచి విచిత్రపడిరి, ౨౬పౌనులు తగ్గినారట, మూడురోజులకుమందిచ్చి వెళ్లిపోయిరి, మరి మూడురోజులమందు సేవించిన నయముకానందున గ్రామస్థులే రెడ్డిగార్కి మందులిచ్చుచున్నారు. పార్శ్వపునొప్పికి, దండరెక్కలకీడి, బొట్టనవేలుపైజీడి, చీలమండలపైజీడి, ఎదురురొమ్ములోజీడి మెడపైజీడి, కంతలలోజీడి, ఎవరికితోచినట్లు వారుబెట్టిరి. ఒకరుకంటిలోమందు, మరొకరుచెవులోనైతే వేరొకరుముక్కులో, కొందరుకడుపులోనికి మందిచ్చుచున్నారు. ఏమితక్కువ అగుటలేదు, విపరీతముగ బాధపడుచున్నారు. హోంసెక్రటరిగారివద్ద వైద్యసహాయముకై విజ్ఞప్తి పెట్టిన, ఇల్లు వదిలిన జేలులో పెట్టుదుమని జవాబిచ్చిరట, స్వంతడబ్బుపెట్టి ఇష్టమొచ్చినన్ని పత్రికలు తెప్పించుకొమ్మని జవాబిచ్చిరట,

శ్రీ రెడ్డిగారు చాలచిక్కిపోయి తెల్లబడినారు. ఎముకలుతో లేగలవు.

శ్రీరెడ్డిగారు తనకష్టములన్ని కజ్జ పైద్వారా భత్తాలనవాలు ప్రధానమంత్రిగార్కి తెలుపుకొనినారు.

ఇట్లు

క.గిరెడ్డి వెంకటరెడ్డి, అమ్మపురము సిరిసిల్ల
భూపతి రెడ్డితండ్రి.



## కావలెను

తెలుగులో బాగుగా కంపోజుచేయ గలవారు వెంటనే కావలయును. వారి పనినిబట్టి తగువేతనము ఇయ్యబడును.

వివరములకు:—

మేనేజరు
గోలకొండపత్రిక, హైద్రాబాదు.

